శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః.

# సర్పశాస్త్రప్రదీపిక



ఇది

సర్పవిషచికిత్సల యందు సహకారియై సర్వజనోప

యుక్తంబయి యుండునటుల



మాకర్ల. వేంకటసుబ్బారాయాఖ్యునిచే

ప్రచురింపంబడి



వేదం అండు కంపెనీలో ముద్రింపంబడియె

మద్రాసు.

1915

మిత్రులారా! మనపూర్వులవలన ఆచరింపబడిన ఆచారములయందును ప్రయోగములయందును నానాట మనకు నమ్మకము తగ్గుచు అనాదరణీయము గలుగుచుండుట అందరును ఒప్పుకొనెడు విషయమేగదా? యిట్టిమార్పు గలుగుటకు కారణము యోచించిచూచిన ప్రస్తుతపు నవనాగరీకతల వల్ల మనలకు కలిగిన మనోభ్రమ తప్ప వేరొకటి కాదని తెలియ వచ్చుచున్నది. పెరటిచెట్టుమందున కుపయోగించదన్నట్లు, అనాదీయములును ఋషిప్రయుక్తంబులును, బుధజనసేవితంబులును నగుమార్గములు అన్నియు యిక్కాలమున పనికిరాని వయ్యెను. అట్లుఅగుటకు కారణమెయ్యది?

గీ॥ అరయగా నమంత్రమగు నక్షరము లేదు,
మందుగానిచెట్టు మఱియు లేదు,
భువి నయోగ్యుడయిన పురుషుండొకడు లేదు,
కూర్చువాడొకండె కొదువగాని.''

అని చెప్పబడియున్న పండితవాక్యములను చక్కగా ఆలోచింపగలిగిన సుధీవరులకు అట్టివాటిని యనుష్టించుటకు అర్హత మనయందు లేకపోవుటయే యని స్పష్టముగాక మానదు. మనయందలి లోపములను గమనించక పరంపరగా వచ్చుచుండు ప్రవర్తనల నిందించుట యెట్టిన్యాయమో చదువరులే యూహించుకొనెదరుగాక. ''చెఱుకునకు వంక బోతేమి చెడునె తీపు'' అన్నట్లు

మనము మనపూర్వుల యాచారములకు వంకలుబెట్టిననేమి అందలి మాధుర్యముబోవునా? అవి యబద్ధములగునా? నీరము గలసిన క్షీరములను వేరుపరచుట కలహంసమెరుంగు నటుల మన శాస్త్రప్రాభవములెన్న పండిత హృదయంబులకుగాక పామర జనహృదయంబులకెట్లు సాధ్యమగును.

నాపరకునేను శాస్త్రజ్ఞాన పరాయణుండను గాకపోయినను చిన్ననాటినుండి బుధజనసాంగత్యము గలుగుటంజేసి కొంత వరకు వారికరుణాకటాక్ష వీక్షణంబులచేత మనపెద్దలయొక్క ఔన్నత్యమునందలి నమ్మకము చెడక క్రమక్రమముగా గ్రంథము లను పరిశీలించుచు నాకు సర్పములవిషయమై చిన్ననాటనుండి యుండిన అపేక్షవలన కొంతదూరము వీటివిషయమై పరిశ్రమ గలుగజేసికొనవలసివచ్చెను. మంత్రవేత్తలగు మహాత్ముల సహా యమువలనను తదితర గ్రంథసంచయమువలనను గలిగిన యను భవములను "పరోపకారార్థమిదంశరీరం" అను ప్రమాణమునం సార్థకముజేయు తలంపున సర్పములవల్ల గలుగు సర్వజన్తో పద్రవంబు నివారించు మార్గమెల్లరకు తేటతెల్లమగునటుల శులభశైలిని వేరువేరు ప్రకరణములుగా విభజించి గ్రంథరూప మున్న నిప్పుడు ప్రచురింప బూనితిని. ఒకవేళ యిందు బొందు పరుపబడిన మంత్రప్రకరణమును జూచినవారు గురువులేని విద్య గూడదని ప్రశంసింప బోదురేమో? యిట్టి యాక్షేపణగలిగినచో నే జేయు చిన్న విన్నపమేమన్నను, శ్రీమహాభారతమునందు కురు సంతతికెల్ల ధనుర్విద్యాచార్యుండగు ద్రోణాచార్యులవద్ద విద్య నభ్యసింప వచ్చిన నేకలవ్యుండను బోయవాని నిదర్శనమువలన, గురువు లేకపోయినను మనకు దృఢచిత్తము ప్రధానమనియు నట్లు

యేకాగ్రమనస్కులమయి వాక్శుద్ధితో నభ్యసించినవిద్య యెట్టి దయినను సాధింపవచ్చుననియు తెల్లమగుచున్నది. గావున బహుకాలపరిశ్రమవల్ల గలిగిన నా అనుభవములను బుధజనప్రయుక్తంబులగు మంత్రరాజములను, చికిత్సలను, లోకోపకారార్థమై యిందు వెల్లడిజేసితిని గాన యీ గ్రంథము సర్వవిషచికిత్సలయందు అందరికి సహాయకారియై సర్వజనోపకారిణియై యుండగలదని నమ్ముచున్నాడను.

ఇట్లువిన్నవించు
బుధజనవిధేయుడు
మా - వేంకటసుబ్బారావు.

---

## మొదటి ప్రకరణము.

---

## సర్పజాతి జన్మాది వివరణ ప్రశంశ.

---

ఈశ్వరసృష్టికి లోనయి కృతత్రేతా ద్వాపర యుగంబుల మేలుబంతియై వన్నెగాంచిన యీ భరతఖండంబున కశ్యప ప్రజాపతియందు కద్రువసంతతి యనంబరగిన శేష, వాసుకై రావత తక్షక కర్కోటక, ధనంజయ, కాళియ మణినాగాపూరణ, పింజర కైలాపుత్ర, వామన, నీలానీల, కల్మాష, శబలార్య దధిముఖ, బాహ్యకర్ణ, నిష్టానక, కోగ్రక, కలశపోతక, హేమగుహా,నహుష, సురాముఖ విమలపిండకాప్త, కర్కోటక, పింగళ శంఖవాలిశిఖ, హాసిపద ముద్గరపిండక, కంబలాశ్వతర, కాళీయక వృత్తసంవర్తక, పద్మశంఖముఖ, కూష్మాండక, క్షేమక, పిండారక, కరపీర, పుష్పదంష్ట్ర, బిల్వక, బిల్వపాండర, మూషకాద, శంఖశిరగ, పూర్ణభద్ర, హారిద్ర, ప్రభాకర కాపరాజిత, జ్యోతిక, శ్రీవహ కౌరవ్య, ధృతరాష్ట్ర, శంఖపిండ, వీరవద్విరజ స్సుబాహు, శాలిపిండ, హస్తిపిండ, పిఠరక. సుముఖ, కౌణపాశన, కుఠర, కుంజర, కుముద, కుముదాక్షీ, తిత్తిరి, హాలికకర్దమ, బహుమూలక, కర్కరాకర్కర, కుండోదర మహోదరులను నాగసమూహంబు నానాటను వృద్ధియై భారత యుద్ధాంతంబున శ్రీమన్నారాయణ స్వరూపుండగు శ్రీకృష్ణునిచే రక్షితుండయిన యప్పాండు పౌత్రుని ఫాలిటి మృత్యువులయిన కతంబున నాతని పుత్రుండగు జనమేజయ

మహారాజుచే జేయబడిన సర్పయాగంబున భగ్నంబయి అస్తీ
కుని వలన నివారింపబడిన యీ తక్షక సంతతివలన యిక్కా
లంబున జనులకు గలుగుచున్న ప్రాణభయము యిట్టిదని
వ్రాయు శక్యము గాకున్నది. యెంత దేహదారుఢ్యముగల
వాడయినను సరే కరచిన సర్పము యెంత చిన్నదయినను సరే
పదినిముషముల కాలములోపల కన్నులెఱ్ఱనై స్మారకముతప్పి
నోటనురుగులు గ్రక్కుచు మృత్యుదేవత పాలగుట చూడ కడు
భయంకరముగా నున్నది. అయ్యో యిట్టి సర్పకాటుగా ప్రవేశిం
చిన మృత్యుదేవతను వెంటనే మరల్చునట్టి సాధకములు చేతి
యందు అట్టి తరుణములో లేకపోవుటయే నొకప్రాణమును
దారబోసికొనుటకు కారణమగుచున్నది. గాన ప్రతిమనుజుడును
యిట్టి విషచికిత్సయందు అనుభవము గలుగ జేసుకొనుట
ఆవశ్యకమగుటచేత సర్పజాతులగురించియు వాటి కాటువగ
యిరాల గ్గురించియు అందుకు జెప్పబడియున్న మంత్రౌషధ
చికిత్సలగురించియు చక్కగా దెలుసుకొన దగియున్నది. పాము
స్వల్పజంతువయినను, దానికాటువల్ల దేహమున ప్రవేసించెడు
విషముమిగులస్వల్పమయినను, దానియొక్క తీవ్రమగుస్వభావము
వలన, కొన్ని నిమిషములలోపల యమసదనమున కనుపుచున్నది.
కఱచిన వెంటనే చికిత్సచేయుటకు ఆలశ్యము జరిగినయెడలగాని
చికిత్స జేయువారలకు తగినంత అనుభవము లేకపోయినగాని కఱ
వబడినవాని ప్రాణమును కాపాడుట దుర్లభము, నాయొక్క
స్వానుభవములో నొకగొల్లపిల్లవాడు తన తండ్రితోడను అన్న
తోడను గ్రామమునకు ఒక ఫర్లాంగుదూరములో యున్నడిన
వారి పొలమునందు నిద్రించుచుండగా ఒక నల్లతాచువల్ల చిత్రి

మగు విధమునకల్పింపబడెను. అదియెట్లనిన. నిద్రించుచుండిన చిన్నవాడు తనయెడమ చేతివ్రేళ్లను నిద్రలో కదిలించుటచూచి యెదోపురుగనుభ్రమచే ఆపాము వానిహస్తమునందలి నడివ్రేలిని మ్రింగసాగెను. చీకటి యగుటచేత పిల్లవాడు ప్రక్కన నిద్రించుచున్నతండ్రిని పిలచి నాయనా నావ్రేలిని యేదో మ్రింగుచున్నదే యని రెండుమూడు పర్యాయములు హెచ్చరించు సరికి తండ్రి పెద్దకుమారుని లేపి నాయనా యింటివద్దకు బోయి అగ్గిపుల్లదెమ్మనగా వాడుయింటికివచ్చి అగ్గిపుల్లగానక పొయ్యిలోనుండిన నిప్పునెత్తుకొని పోయి సదరుపొలములో కుప్ప వేసియుండు కసవునురాజబెట్టి దాని వెలుతురునచూడ నొక నల్లతాచు పిల్లవాడి నడివ్రేలును మ్రింగుచుండుట తెలియ వచ్చెను. పాము వెలుతురును జూచినవెంటనే వ్రేలువదలి చెంతనున్నయొక జొన్నచొప్ప కుప్పలోబ్రవేశించెను. వెంటనే వాడు యాకుప్పకు నిప్పంటించి పామునుచంపి పిమ్మట ఆపిల్లవానినెత్తుకొని గ్రామమునకువచ్చి నిద్రించుచున్న నన్నులేపిరి గాని, ఆపిల్లవాడు తండ్రిని లేపునప్పటినుంచి నావద్దకువచ్చు వరకు నిండా కాలహరణము జరిగినందున విషముదేహమంతట వ్యాపించి యాపిల్లవానికి స్మారకము లేక పోవుటచేత కించిత్తయినను ప్రయోజనము లేకపోయెను. ఆపిల్లవాడు వచ్చిన అయిదు నిముషములలోపలనే మృతిజెందెను. ఆపిల్లవాని వ్రేలిని పరీక్షించిచూడగా ఆ సర్పము మొదట ఆవ్రేలు కదులు చుండుటచే యేదొభావమున మ్రింగజూచి వ్రేలి మొదలువరకు మ్రింగినదై అటుపైన మ్రింగ వీలులేమిం జేసి వానియన్న నిప్పుతెచ్చి చెత్తమంటచేయు పర్యంతము బాగా యీవ్రేలిని

నమలియుండునట్లు తెలియవచ్చినది. వ్రేలంతయు రాగిచిలుము వలె పచ్చనై యుండెను. యిట్లు సావకాశముగా నడచిన కాటు వల్ల యెంత ఆలశ్యము జరిగి యుండవలెనో యెంతవిషము వాని దేహాములో ప్రవేశించి యుండవలెనో చదువరులే యోచింపవచ్చును పాముకాటు కెప్పుడు వెంటనే అనగా విషము దేహామునందు వ్యాపించకముందే చికిత్సచేయుట కారంభించ వలయునుగాని "ఆలశ్యం అమృతం విషం" అన్నట్లు విషము దేహా మంతటీ రక్తములో ప్రవేశించి రక్తమునల్లబడిన పిమ్మట యెట్టి చికిత్సలయినను ప్రయోజనము లేదు. ప్రతిసంవత్సరము రమారమి యిరువదివేలమంది సర్పకాటువల్ల నష్టమగుచున్నదని ప్రభుత్వము వారివల్ల నిర్ధారణ చేయబడియున్నట్లు తెలియుచున్నది. యింత జననష్టమీ యల్ప జంతువులనుంచి గలుగుచుండ దాని పరిహార మార్గములను మనము యోచింపకుండుట కడుక్రూరమై యున్నది కొన్ని ప్రదేశములలో ప్రభుత్వమువారు యీ జంతువుల ను ద్రవ్యమునిచ్చి చంపించుచున్నారట. యిట్లు వాటిని నిర్మూ లింప జేయుట మంచి ప్రయత్నమేగాని పూర్తిగా నెరవేర్పబడ జాలదు. యీజంతువులు జనసంచారములేని స్థలముల యందు వసించుటచేత అదేపనిగా వీటిని వెదుకు కొనుచుండుటకు తగు ప్రోత్సాహము గలుగుట కష్టము.

కొందరిడాక్టర్లు మొదలయినవారి అభిప్రాయములలో పాముకాటునకు తగుచికిత్స లేదనే తోచుచున్నట్లు తెలియవచ్చు చున్నది. అట్లయిన మనదేశములో యీవిష జంతువులతో వారి జీవితకాలమంతయు గడుపుచుండెడి పాములవాండ్రను నొకజాతి వారున్న సంగతి అందరికి తెలిసిన విషయమేగదా? అహార్నిశా

దులు అదేజీవనముగా యీ విషజంతువులతో బోరాడునపుడు అవి వారినికరువకుండా యుండుటకు వీలుపడదుగదా? ఒకవేళ వారలు కోరలుపీకివేసిన పిమ్మటగాని వాటినిబయట ఆడించరని ఆక్షేపించెడి పక్షమున కోరలు తీసివేయుటకు ముందు అయినను వాండ్రు స్వహస్తములతో పట్టుట తటస్థించుచున్నది. అట్టిసమయముల యందయినా వారు దానిచే కఱువబడునట్టి స్థితియందుటున్నారు. గావున మనము కొంచెము దీర్ఘముగా నాలోచించినయెడల యీ పాములవాండ్రు యట్టిసర్ప విషచికిత్స రహస్యములను స్వాధీనానుభవమున యుంచుకొని యుండుట చేత వారలకిట్టి విషజంతు సాంగత్యము సాధ్యమగుచున్నదిగాని లేనియెడల కాదని తోచకమానదు. నాబాల్యము విశేషముగా యీసర్పములుండు ప్రదేశముల యందు గడుప తటస్థించినందున వీటివలన జనులకు కలిగెడిభయమును విపత్తులను స్వయముగా వినుటచేతను చూచుటచేతను వీని నివారింప గలుగు యోచన నానాటను నామనంబున ప్రబలుటచే పాములను పాముల వాండ్రను జూచినప్పుడెల్ల వారు వాటినిపట్టెడి విధాయకములను గ్రహచారవశాత్తు యవికఱచినపుడెల్ల వారు జేయు చికిత్స విధాయకములను గురించి విచారించుచు నలుప్రక్కల, మంత్రములా,తంత్రములా యని జనులు జేయు ప్రసంగముల గమనించుచు నానావిధాభిప్రాయములను అనుభవములను వెల్లడించుట కింత కాలముపట్టెను. పాములవాండ్రు మొదట పామును పట్టునప్పుడు వాటిచేత కఱువబడకుండు నంతటి జాగ్రతతోను నిపుణతతోను పట్టుచున్నారు. యిట్టి సందర్భములలో ఒకవేళ కఱువబడుట తటస్థించిన యడల వెంటనే కఱువబడిన ప్రదేశము

నకు అనగా చోటునకు యిరువైపుల ఆ కాటునుంచి విషము దేహామునందంతయు వ్యాపించకుండునటుల కట్లవలన కఱచిన ప్రదేశముననే నిలిపి ఆకాటును చిన్నకత్తి మొనతో కొంచము తెరచి అందులోనుండు విషమును తీసివేయుచున్నారు. కొన్ని సందర్భములలో అవుషధములను ప్రయోగించి దేహాములోని విషమును విఱచి వేయుచున్నారు. అనగా నిర్విషముగావించుచు న్నారు మరికొన్ని సమయములయందు ఋషిజనప్రయుక్తంబు లగుమంత్రరాజముల నుపయోగించుచున్నారు. యిట్టి పరికరప్ర యోగములు గలుగుట చేతనే వారు యెంతటి సర్పము నయినను వెనుదీయక లోబరుచుకొనుచున్నారు. నేనుజూచిన పాముల వాండ్రలో నొకని కుడిచెయ్యి నొకగ్రామమునందలి రెడ్లమిద్దెలో మిద్దెదంతెల సందున గొప్పపాము వున్నదని పిలువబడి దానిని బట్టుటకు పదిరూపాయల కట్నము నొప్పుకొని, పట్టుసందర్భ ములో షాముపుండిన చోటు వీలుగాని ప్రదేశమగుటచేత కఱువబడెననియు, కఱచినపాము పీతిరినాగు అగుటచేత కండకం డగా వూడిపోయి చెయ్యి భిన్నమయిన దనియు చెప్పియుండెను. నేను యిందలి నిజమును తెలియగోరి యారెడ్లను విచారించగా వారు నిజమేయని చెప్పినందున తృప్తి జెందినవాడనైతిని. పాము లవాండ్రు పాములనుబట్టిన తరువాత వెంటనే వాటికోరలను తీ సివేయుచున్నారు. కోరలు తీసివేసిన తరువాత విషప్రదములగు పాములు ఆహారమును స్వయముగాభుజించుటలేదు. అందుచేతనే పాములవాండ్రు వాటికి ఆహారమును నోరుతెరచి నోటిలో గ్రు క్కి మ్రింగజేయుచున్నారు. విషప్రదములు గాని పాములకు కోఱ లులేనందున అవి ఆహారమును తమంతట తామే భుజించుచు

న్నవి, యిందువల్లనే. కోటలు తీయబడనవి పాములు చాలా కాలము జీవించకుండుటకును, తీయబడనివి చాలాకాలము జీవించి యుండుటకును కారణమగుచున్నది. సర్పములు ఆహారము లేకపోయినను కనీశము రెండుమూడుమాసములవరకు జీవించగలిగియున్నవి. సాధారణముగా చలికాలమంతయు యివి యిట్లుగడుపుట గలదు. అయితే యిట్టికాలములలో యివినిండా శుష్కించియుండును గాని యితరకాలములయందువలె జవసత్వములు గలవై యుండవు. పాములు సాధారణముగా యెలుకలు, చిట్టెలుకలు, కోడిపిల్లలు, కోడిగ్రుడ్లు, కప్పలు, చిన్నపక్షులు,బల్లులు మొదలగు జంతువుల ఆహారమువల్ల జీవించుచున్నవి. కోడిపిల్లలుమొదలగు చిన్నపిట్టలయందు కోడిగ్రుడ్లయందు పీటికి విశేషము ఆపేక్ష యగుట చేతనే నాగుబాము మొదలగు సర్పములు కొన్ని మనుష్యనివాసములయందు జేరుటకు కారణమైయున్నది. ఆహారమునకై వెదుకు సమయములయందు విషప్రదము లయిన పాములును, కాని పాములును నిండాభీకరముగానుంటున్నవి. కొన్నిపాములు తమలో చిన్నచిన్నవిగా నుండు యితరపాములనెల్ల మ్రింగునట్లు తెలియుచున్నది. యిందువలన జనులకు చాలా సహాయము జేసిన వగుచున్నవి. పాములు సాధారణముగా ఒకటి రెండు డజన్ల గ్రుడ్లను పెట్టుచున్నందున సదరు పిల్లలు పెద్దవాటివల్ల యిట్లు మ్రింగివేయబడనిచో తండోపతండములుగా వృద్ధియై దేశమంతయు సర్పమయమగుచున్నది. పాములు. సాధారణముగా యెండకాలములోను నీరుతగలని మెరక ప్రదేశములయందును గ్రుడ్లుపెట్టుచున్నవి. వాటిగ్రుడ్లు నీళ్లలోనానుట తటస్థించినయెడల వెంటనే చెడిపోవుచున్నవి.

వర్షములు కురిచి జలమయమయి వున్న సమయములయందును, ఆహారమును వెదుకు సమయములయందును, సర్పములు చెట్లు నెక్కుటగలదు. చెట్లయందు పక్షులు పిల్లలు జేయు టచేత ఆపిల్లలను మ్రింగుటకుగాను యివి చెట్లయందు చేరుచున్నవి. విషప్రదములగు పాములు ఒకటి రెండురోజుల ప్రాయము గలవయి నప్పటికిన్ని తాచ్చారము చేయకూడదు, కరచినయెడల చికిత్సచేయుటగాని చూచినయెడల చంపివేయుటగాని అత్యావశ్యకము కప్పలకు పాములవల్ల ప్రాణహాని యెట్లుగలుగుచున్నదో అదేప్రకారము పాముపిల్లలకు పెద్దకప్పలవల్ల ప్రాణహాని యట్లేకలుగుచున్నది. పాములనారిగాడు అని చెప్పబడు కొంగ జాతిలోచేరిన నొక నీటిపక్షి నీటిలోనుండు పాములను మ్రింగుట యేగాక అరణ్యములయందుండు ఖైరి గరుత్మంతుడు మొదలగు పక్షులును ముంగిసయు యీపాముల పాలిటి మృత్యువులుగా నెన్నబడియున్నవి.

విషప్రదములగు వాటికి కోఱలుతీయనిచో వారియింటిలో నున్నబిడ్డలు మొదలయినవారికి ఆపాయము తటస్థించు సందర్భమేర్పడుటయెగాక యింటియందుండు వారలలో యెవరివద్దనంటె వారివద్ద యీపామును యిచ్చి గ్రామములమీాద యాచకార్థము పంపుటకు వీలులేక పోవుచున్నది. యీ విషయములో కొంచెము అప్రసిద్ధజరుగుటంజేసి నా శోత్రియగ్రామమగు పాయలకుంట్ల యందు పాము నాడించుచు యాచకము గావించుచుండిన ముసలివాడొకడు పాముచేత కరువబడి అచ్చటికి సమీాపములో యుండిన మాంత్రికురాలగు తనభార్యవద్దకు వెళ్లనుద్దేశించి మధ్యదారిలో మృతుడగుట తటస్థించెను. వానిభార్యకు ఆసం

గతి తెలిసి గ్రామమునకు వచ్చినప్పుడు యీపాము రెండురోజుల క్రింద పట్టబడిన దగుటచేత దానికోరలు తీయలేదనియు యీ మునలివాడు తాను గ్రామముల మీదవచ్చు సంగతి తాసింటలే మిం జేసి తనతో చెప్పకుండా దానినెత్తుకొని వచ్చెనవియు దానిచేత యిట్లు తటస్థించుటకు కారణమయ్యెననియు దానివల్ల తెలియవచ్చినది.

ఈ పాముల విషయములలోను వీటికాట్లకు తగుమయిన చికిత్సలు కనిపెట్టుట యందును డాక్టరు, ఫెయిరర్, విన్సెంట్ రిచ్చర్డ్సు మొదలగు ఇంగ్లీషు డాక్టర్లు చాలాదూరము ప్రయాసయును పరిశ్రమను కలుగజేసికొని యున్నారు. డాక్టర్సు విన్సెంటు, రిచ్చర్డ్స్ వీరిరువురివల్ల వెల్లడిజేయబడిన "లిగేచర్" ప్రయోగము ప్రతిదినము మన పాములవాండ్రవల్ల వాడుబడుచుండు చికిత్సయేగాని మరియొకటిగాదు. యీ "లిగేచర్" అనగా విషమును కఱచినస్థలమునుంచి అటుయిటు వ్యాపించకుండ కట్లవల్ల నిలిపి కఱువబడ్డ చోట సన్నకత్తి మొనతో గీరి ఆగాయమునుంచి విషమును బయటికి తీసివేయుటకు యివ్వబడినపేరు. యీ "లిగేచర్" ప్రయోగములో చాలా అనుభవము గావలసియున్నది. అనుభవముచాలని కొన్ని సందర్భముల యందు కాటునుంచి విషము పూర్తిగా బయటికి వచ్చినది లేనిది తెలుసుకొనలేక "లిగేచర్" అని చెప్పబడుకట్లనుచాలా కాలము విప్పకయుంచిన యెడల దేహమునందలి రక్తప్రవాహంములకు యాటంకము గలుగజేయబడుటచేత పాము కాటువల్ల పడెడి శ్రమకంటె యీకట్లవల్ల పడెడిబాధ మిక్కిలి యెక్కువగా నుంటున్నది డాక్టరు రిచ్చర్డ్సు అనుసతను యీ సర్పకాటు

విషయమునను దాని చికిత్స విషయముననూ జరిగించిన పరీక్షలలో ఒకనాడు తానే స్వయముగా కి ఉవబడినందున పయి "లిగేచర్" ప్రయోగమును గావించుకొని దాని కాలపరిమాణము నందలి అనుభవము చాలమించేసి చాలాబాధ పడిరి. మనదేశమునందలి పాములవాండ్రకు తెలియని విషయములు డాక్టరు ఫెయిరర్ మొదలగు ఆంగ్లేయ శాస్త్రజ్ఞులవల్ల నిండా సూక్ష్మముగా పరిసీలించబడియున్నవి. యిందుకు నిదర్శనము డాక్టరు ఫెయిరరుగారివల్ల వ్రాయబడియుండు "తనతోఫిడియా" యను గ్రంథమే. సర్పములు మొదట రెండు జాతులుగా భాగించబడియున్నవి. వానిలో ప్రాణోపద్రవకరమయిన విషముగల పాములు మొదటి తరగతిలోను, ప్రాణోపద్రవ కరములు గాని పాములు రెండవ తరగతిలోను చేరుచున్నవి. మనదేశమునందు సాధారణముగా మిక్కిలి తీవ్రమగు విషముగల సర్పములు నాగుబాము జాతిలో చేరినవై యున్నవి. యివి పసుపు, తెలుపు, నలుపు మొదలగు వర్ణభేధములచేతను వాటిదేహమునందలి చుక్కలభేధముచేతను పడిగయందుండు మచ్చల భేదముచేతను అనేక విధములై యున్నవి. సర్పములు సాధారణముగా కొండ భూములయందు నిండా పెద్దవిగా పెరుగుటయేగాక కొండ గుహాలయందు వీటికి తగుమయిన వునికిపట్లుండుటచేత "పడియుండదె పేర్మిపాము పదినూరెండ్లుణ్" అనులోకోక్తిప్రకారము చాలాకాలము జీవించి యుంటున్నవి. యీ సర్పజాతులు భూమియందేకాక నీటియందునుగూడ వసించుటకలదు. అయితే మంచి నీళ్లయందుండు పాములు విషప్రదములుగావనియు వుప్పునీళ్లయందుండునవి విషప్రదము

లనియు డాక్టరు ఫెయిరర్ గారు అభిప్రాయపడిరి గాని సాధారణముగా మన మంచినీళ్ల చెరువుల యందును గుంటలు మొదలయిన జలాసరములయందు నీరుకట్టు నీగుకట్టుడి, అని పిలువబడు పాము విషముగలదైయ్యే యున్నది. పాములలో పడిగగల పాములు అతి భీకరములు. అవి యేదయిన నౌకమార్గమున చెనకబడిననే తప్ప యితరత్ర సాధారణముగా కఱచుట లేదు. పడిగగల సర్పములుకొన్ని 10, 12 అడుగుల పొడువును గలవై యున్నవి. పామెప్పుడు పెద్దదిగా నుండునో అప్పుడే దానికోరలును దాని దేహ ప్రమాణము ననుసరించి పెద్దవిగా నుంటున్నవి. కోరలు యెప్పుడు పెద్దవిగా నుంటున్నవో అప్పుడేవాని కాటున్ను నిండా అపాయకరముగా నుంటున్నది. యీ పాములు వాటి ఋతుకాలములలో భేదాభేదములులేక పడిగ కలవియును లేనివియును గూడుచు పలువిధములగు సంతతిని గలుగజేయుటయునుగలదు. సర్పములు సాధారణముగా మంచి వేసవియందు సందలశిన పిమ్మటను, కొద్దిగా వర్షముగురిచిన రోజునను తమతమ వునికి పట్లలో వేడిమికి తాళజాలక గాలికై బయటికి బయలుదేరుచున్నవి. పక్షిజాతిలో చేరిన మైనా అని పిలువబడు గోరువంక, గరుడపక్షి, మొదలగునవి యెచ్చటయినను యీసర్పములను బయళ్లలో జూచినయెడల ఆసర్పముమీాద నెగురుచు కలకలధ్వనితో దానిని తన్నుటకు వెనుకొనుచున్నవి. దానిని తన్నవచ్చినపుడంతయు ఆ పాము తన తలను భూమితో జేర్చి గాపాడుకొనుచు యితర సమయములలో పడిగెనెత్తి బిగ్గరగా బుసలుగొట్టుచు యీా పక్షులనన్నింటిని సమీాపమునకు జేరనియ్యక పోరాడుచున్నది. పాములు

ముంగిసతో బోరునప్పటి యద్భుతప్రవర్తనలు పొలములలోనట్టి సమయమున నుండి జూడ తటస్థించిన జనులకుగాని యితరులకు నూహింపవలవిగాకున్నవి. సర్పములు సర్వదా కంపకంచెలయందును రాళ్లగుట్టలయందున్ను సంచరించుచుండుటచేత వీటి సర్వాంగరక్షణమునకై పలచని అభ్రకపురీతిని గనుపించు నటువంటి నొకకవచమును దైవము నిర్మించియున్నాడు. యీ కవచము దేహమును మాత్రమేగాక కన్నులను ముఖ్యముగా గాపాడుచున్నది. కాలక్రమమున యీ కవచముక్రింద మరియొకటి యుత్పన్నమగుటచేత వీటిదళమెక్కుడయి సర్పమునకు కన్నులు గానరాక తుదకు నొకచోట పడియుండుట జూచుచున్నాము. దీనినేమనవారు కుసము లేక కుబుసమువిడుచు కాలము అని జెప్పుచున్నారు. యీ కుసము విడుచుకాలము కనిసము ఆరుమాసముల కొకపర్యాయమునకు తగ్గనట్లు తెలియవచ్చుచున్నది. యిట్లు జీర్ణమును మలినమును అయిన కవచమును వదలి నూతన కవచధారియై వెలువడు సర్పములతి భీకరముగాను చురుకుగాను గానుపించుచున్నవి. యీకుబుసములనుమనముస్వయముగా పరీక్షించిచూచినయెడల కన్నులుమొదలయిన వాటినికాపాడుటకు యీశ్వర నిర్మితమయిన కవచమని యెల్లరకుగోచరముగాక మానదు. కొందరు పామును చూచినయెడల వెంటనే దానితోకనుబట్టియెత్తి నేలను మోది చంపుచున్నారు. కొన్ని సమయములలోతోకనుపట్టు కొన్నవెంటనే అది బలముగలదయిన యెడల తోకవైపునకు నిడుపుగా లేచి పట్టుకొన్నవానిచేతిని కఱచుట యునుకలదు. కావున యిట్లుచేయుట అన్నివిధముల మంచిది కాదనే నా అభిప్రాయము.

## రెండవ ప్రకరణము.

---

ఇందు ముఖ్యముగా పాముకాటును గురించియు వాటి కోఱలు విషము వగయిరాలను గురించియు ప్రశంసించెదము. విషప్రదములగు పాములయొక్క కాటువలన అపాయము లేకుండుట అరుదు. భారతీయులు యీ సర్పవిషమును అవుషధముల యందు వుపయోగించున్నారు. దీనినే గరళము అనియందురు. యిది తేనెవర్ణముగలదై జిడ్డుగానున్నది. ఒకచుక్క నాలుకయందుంచిన యెడల ఘంటల పర్యంతము నాలుకంతయుచేదుగానుండును. అది మితిమీరిపుచ్చుకొన్న యెడల ప్రాణోపద్రవమును కలుగజేయుచున్నదే గాని తగుమాత్రముగా జూచి పుచ్చుకొనిన యెడల యేలాటి అపాయమును కలుగదు. యీ విషము యెంతకొంచమయినను దేహామునందలి నెత్తురులో కలియుట తటస్థించిన యెడల వెంటనే ప్రాణమును హారించుచున్నది. నాచిన్న తనమునందు పుల్లంపేట యను గ్రామములో మాయింటియెదుట సర్పవిష చికిత్సగావించుచుండిన మంత్రవేత్తయగు సరాబు సుబ్బారావను నొక బ్రాహ్మణోత్తముడుండెను. ఆగ్రామమునకు వచ్చు పాములవాండ్రందరు ఆయన యింటివద్దకువచ్చి పోవు వారగుటచేత కొన్ని సమయముల యందు అవుషధమునకై విషమును అనగా గరళమును పాము కోటనుండి పాములవాండ్రచేత పిండించుచుండుటను చూచియున్నాడను. యీ విషమును చర్మముమీద రుద్దిన యెడల సబ్బువలె తెల్లనై గానుపించుచున్నది. యీ విషమును యెండయాగు

యొండించిన యెడల యందలి బలము తగ్గు చున్నదని చెప్పు చున్నారు.

పడిగలేని పాములకంటె పడిగగలపాములకు విషము అధికము. సాధారణముగా విషప్రదములగు వాటికన్నిటికి ఆరుకోఱ లుండును. అందులో రెండు వుపయోగపరచబడు స్థితియందుండును. మిగత నాలుగు నిండాచిన్నవై ప్రస్తుత వుపయోగమునకు పనికి రాని స్థితియందుండును. పాము కఱచునపుడెల్ల ముందు చెప్పబడిన రెండు పెద్దకోఱలతోనే కఱచుచున్నది. యీ కోఱలకు భిన్నము సంభవించిన యెడల చిన్నవిగానుండిన వానిలో రెండు భిన్నమయిన పెద్దకోఱలకు బదులుగా వుపయోగింపబడుచున్నవి. పాములు గ్రుడ్లలోనుంచి బయలుదేరునపుడే యీ ఆరుకోఱలతో బయలుదేరుచున్నవి. గాని యీ చిన్నకోఱలు నాలుగున్నూ నిండాచిన్నవగుటచేత కొన్నిసమయములలో అవి యుండుటకూడా చక్కగా తెలియుటలేదు. యీ ఆరుకోఱలు నిశ్శేషముగా తీసివేయబడిననే తప్ప అట్టిసర్పములను నిరపాయములగు జంతువులని చెప్పుటకు వీలులేదు. పాము ప్రతికోఱయొక్క కుదుటియందును విషముండుటకు తిత్తులున్నవి. అవికఱచుసమయమునందు కోఱలు నోటిలో నిలుచుకొనియుండుటకును యితరవేళలయందుఆకోఱలు నోటప్రాలియుండుటకును తగినయేర్పాటుగలవియై యున్నవి. అనగా నోరు తెరువకుండు పర్యంతము యీ కోఱలు ప్రాలియుండును నోరుయెప్పుడు తెరువబడునో అప్పుడు యీ కోఱలు నిలుచుచున్నవి. యీకోఱలు సన్నగుండు సూదికన్న సూక్ష్మపరిమాణముగలవై వంకరగా శృంగాకృతి గలిగియున్నవి. వీని లోభాగమున వెంట్రుక ప్రమాణమునకన్న

సూక్ష్మమయిన మార్గము లుండుటచేత బోలుగా నున్నవి. యీ కోఱల మధ్యమునగల సూక్ష్మద్వారముల గుండా సర్పము గఱచునపుడెల్ల పైజెప్పిన తిత్తులలోనుండు విషమును కాటు మార్గమున రక్తములో ప్రవేశింప జేయుచున్నది. యిట్లు తిత్తులలో చేరియుండు విషమును పలుమారు బయటికి వచ్చునట్లు చేసిన యెడల సదరుతిత్తులలోని విషమంతయు పోవుచున్నది. అట్టి సందర్భములలో విషము సదరుతిత్తులలో మరల చేరువరకు యెట్టిసర్పమయినను నిస్సార మవుటయే గాక అట్టిసమయములో కఱచిన కాటువల్ల ప్రాణోపద్రవము లేకయుండును. యిట్టిసమయములో వాటికోఱలను సూక్ష్మవస్తువులను పరీక్షించు భూతద్దముతో పరీక్షించి చూచిన యెడల వాటిమధ్యనుండు సూక్ష్మద్వారములు విశదముగా తెలియవచ్చుచున్నవి. డాక్టర్ ఫెయిరర్ మొదలగువారు యీకోఱల మధ్యనుండు నాళములు నేరుగా కోఱల కుదుటినుంచి మొనల వరకు వ్యాపించియుండునట్లు చెప్పి యున్నారు గాని మనము సదరు నాళమార్గమున నొక వెంట్రుకను ప్రవేశింపజేసి చూచినయెడల యీ వెంట్రుక కోఱ కొనలనందుండి బయటికిరాక యీకోఱలకు మధ్యభాగమున ప్రక్కవాటుగా బయలుదేరుట చూచుచున్నాము. యిది ప్రాణకోటికి దైవనిర్మిత మయిన సహాయముగా నెన్నబడుచున్నది. డాక్టరు ఫెయిరర్ మొదలయిన వారభిప్రాయపడినట్లు వీటి కోఱలయందుండు సూక్ష్మనాళములు కోఱ మొనల వఱకు వ్యాపించి యుండుటయే తటస్థించిన యెడల యెంతస్వల్పకాటు అయినను విషప్రదమై ప్రాణాంతక మగుటకు సందియము లేదు. యీకోఱలుగాక పాములకు వాటి యాహారనిమిత్త

ము వేరు పండ్లుగలవు సాధారణముగా నాగుబాము. లేకతాసు మిణ్నాగు, జెట్టిపోతు, తాటిజెట్టి, నల్లతాసు పీతిరినాగు, పొడ పింజర, పొట్టపింజర, రక్తపింజర, కట్లపాము, నూనెకట్టుడి పసిరిక పాము, తుట్టెపురుకు నిరుకట్టుడి, దాసరిపాము, పూడుబాము, కొండచిలువ మొదలగునవిమనము అప్పుడప్పుడుసాధారణముగా వాడుకలోవినుచును చూచుచును యున్నాము. పాముకాటును కొంద రనుభవజ్ఞులు మూడు తరగతులుగా భాగించి యున్నారు మొదటిది రెండవది అసి గాయములు అనియు అనగా కోఱలు పూర్తిగా దేహమునందు దిగక పైపైన గీచుకొనుటచేత నేర్పడినవి గావున వాని విషయములో మనము భయ పడవలసిన ప్రమేయము యేమియులేదు. పై రెండువిధ మయిన కాట్లవల్ల ప్రాణోపద్రవము తటస్థించదు. మూడవ వదగు కాటువల్ల అనగా కోఱలు రెండుగాని లేక యొకటిగాని దిగి చర్మమునందు రంధ్రములేర్పడి యుండినట్టి కాట్లే నిండా అపాయ కరమయినవిగాను ప్రాణాంతకమయినవిగాను యెంచ బడుచున్నవి. యెందుచేతననగా పాముకోఱలయందుండు మార్గ ములు కోఱచివరకు లేకుండ మధ్యప్రదేశమున ప్రక్కలయం దుండుట చేత యది కఱచునపుడెల్ల వాటి కోఱలు పూర్తిగా దేహమునందు దిగుట తటస్థించిననేగాని యా కోఱల మధ్య నుండు మార్గముల గుండ విషము దేహమునందు ప్రవేశించు టకు వీలులేక పోవుచున్నది. యిందుచేతనే కోఱలయందుండు విషముప్రవేశించు మార్గములకు పైభాగములగు మొనలవల్ల కలగిన పై రెండు విధములగు అసికాట్లవల్ల ప్రాణోపద్రవము గలుగకుండుటకు కారణమగుచున్నది గాని వేరుకాదు. పై రెం

డువిధము లయిన అసిగాయములు పాము సరిగా దానికోఱలను దేహమున నాట జేసి జేయకయుండు నట్టిస్థితియందే దానిని విడిలించివేయుటచేత కలుగుచున్నవి. అటువంటికాటులయందు అవుషధములు మొదలయినవిమిక్కిలి పనిచేయుచున్నవి మూడవవిధమగు కాటుకు అవుషధములు పని చేయకుండుటకు తగుకారణము గను పట్టుచున్నది. యేలననగా అవుషధము. పని చేయుటకు కొంతసావకాశము పట్టుచున్నదిగాన దానికంటె తీవ్రముగాపని చేయునట్టి విషమును విఱచి వేయుటకు వీలులేకపోవుచున్నది. మూడవవిధమగు కాటునందు పూర్తిగా కోఱలు దేహమునందు దిగునంత సావకాశమున గలుగుటజేత విషము వాటి ద్వారములగుండా దేహమున పూర్తిగా ప్రవేశించుచున్నది. యిట్టికాటు కలిగినచోట సన్నగుండుసూదితో చేయబడిన బొక్కలవలె రెండురంధ్రములు కనుపించుచున్నవి.

కొన్ని సమయములలో నొకే కాటు కనుపించుటయు కలదు. యిట్టిసమయములలో యిది పాముకాటయిన రెండుకాట్లుండ వలయునుగదా యిదియొకటగుట చేత పాము కాటుకాదనినిర్ధారణ చేయకూడదు. పాములకు కోఱలు సాధారణముగా భిన్నమగుట తటస్థించుచున్నది గాన ఒకేకోఱదిగియుండుట తటస్థించినప్పుడు యీ పామునకు రెండవకోఱ విరిగిపోయినట్లుగా నూహింపవలసియున్నది. పాముకాటుయెప్పుడును చక్కగాపరిశీలించి నిర్ధారణచేయ వలసియుండుటచేత యిందు తగుయనుభవముగల్ల వైద్యునిచేతనే జూపింపబడవలసి యున్నది. సాధారణముగా పాముకఱచిన స్థలమునందు చురుకు చురుకుమని పోటుగలిగి మండుచుండును. తేలు, కందిరీగ జెట్ట, జల

మండల వీనిలో నేదయిన కఱచినను గూడ యిట్లుండుట కలదు. జలమండలకఱచినయెడల పామువలె నే ప్రాణమునకు అపాయము గలుగునట్లు తెలియుచున్నది. కొన్నిసమయములలో కొందరు తేలు కాటువల్లకూడా మృతులగుటు తటస్థించుచున్నది. తేలు మొదలగు వాని కాటువల్ల గలుగు బాధకంటె నాగుబాము మొదలగు కొన్ని సర్పముల యొక్క కాటువల్ల కలిగెడి బాధ మిక్కిలి యెక్కువగుటచేత కఱువబడి నటువంటి మనిషి తనకుగల బాధ యిట్టిదని వివరించ లేనంతటి స్థితియందుండును. గనుక నే కాటును చక్కగా పరిసీలించి యది పాము కాటయినది కానిది తెలిసి కొనవలసియున్నది. పాము తేలు మొదలగు వాని కాట్లకు గల భేదాభేదములను ముఖ్యముగా గమనింపబడుటకు నిచట వివరించుచున్నాడను. పాము కాటు వలనే జెఱ్ఱికాటునందును రెండుకాట్లు తెలియవచ్చుచున్నవి గాని జెఱ్ఱికాటు పాముకాటు వలె ఘంటలపర్యంతము విశదముగాను స్థిరముగానునుండుట లేదు. జెఱ్ఱి మొదలగువాని కాటునందు కఱువబడినచోట నెఱ్ఱనై యుండునుగాని, పాముకాటునకువలె నీలవర్ణముగలదై యుండుటగాని లేక నల్లనై యుండుటగాని తటస్థించదు. పాముకాటునందు దాని కోఱలవల్ల గలిగెడి గాయములు రెండు గాక దానిపండ్లవల్ల గలిగినగాయములుకూడా యుండుటయేగాక వీనినుండి విశేషము రక్తము కారుటయును గలదు. యిట్టి గాయములుగాని రక్తముకారుటగాని పైజెప్పిన తేలు, జెఱ్ఱి కందిరీగ మొదలగు వాని కాటునందుగలుగవు. పాముకాటయిన యెడల యది కఱచిన ప్రదేశమున దానియెంగిలి తగులుటచేత యాప్రదేశము దీపము వెలుతురున పరీక్షించిన యెడల ఒక

విధమైన తెల్లని మెఱుపు గలిగి కనిపించుచున్నది. యీపైజెప్పిన గుర్తులన్నిటికంటెను కఱచినచోట వెంటనే "లిగేచర్"ను కట్టి కాటును లాౕసెట్ అనుకత్తిమొనతో గీరి పరీక్షించిచూచిన యెడల అందురక్తము లేక పోయినగాని, దానియందలి రాక్తము నల్లబడిగాని లేక రంగుమారి యుండినగాని యది పాముయొక్క కాటని వెంటనే భావించవలసి యున్నది. పాముకఱచిన వెంటనే కఱువబడిన ప్రదేశము వాయుచున్నది. యీవాపుకొంత సేపుండి మరల తీసిపోవుచున్నది. యిదితీసిపోయిన ఘంటకాలములోపల మరల రెండవతూరి వాయుచున్నది. కఱచినవెంటనే కలిగెడివాపు విషముండు కారణముచే గలిగినదైయున్నది. రెండవపర్యాయము గలిగెడి వాపు గాయములవల్లననగా కాట్లువల్లగలిగినదై యున్నది. కాటునందలి విషము దేహమునందు నెక్కుటకు ప్రారంభించక యున్నంతకాలము కఱచినచోట వాపుగలిగియుండును అనగా యెంతకాలము యీమొదటిదఫా కలిగెడివాపు యుంటున్నదో అంతకాలము విషము గాయములోనుండునట్లును, దేహమున నెక్కుటకు ప్రారంభించలేదనియు తెలియవలెను. యెప్పుడు యీ వాపు తీసి పోవుచున్నదో అప్పుడు విషము గాయమునువదలి వ్యాపించుట కారంభించినట్లూహించవలయును. ముందుచె ప్పినప్రకారము పామునకు రెండుకోఱలుండుటచేత రెండుకాట్లు గలుగుచున్నవి. యీ రెండుకాట్లయందు ప్రవేశించు రెండు చుక్కల విషము దేహమందెక్కుటకు ప్రయత్నించి తమకు సామీప్యమునందుండు రక్తనాళములకై వెదకుచున్నవి. కొన్ని సమయములలో సదరుకాట్లు ఒకటయినను సరేలేక రెండయినను సరేమనుష్యశరీరమునందలి రక్తనాళములయందే బడుట తటస్థిం

చినయెడల విషము వెంటనే దేహమున వ్యాపించుటకు ప్రారంభించి అతిత్వరలో మరణమును కలుగజేయుచున్నది. సర్పవిషము దేహమునందు బహు చిత్రముగా నెక్కుచున్నది.

అదియెట్లనిన సర్పకాటువల్లకలిగెడి రెండుకాట్లయందుండు రెండుచుక్కలవిషము దేహమునందు తామొకటితోనొకటి కలిగుక వాటికెడమవైపునసామీప్యములోనుండు రక్తనాళముల యందుబ్రవేశించి దేహమునవాటి గుండావ్యాపించుచున్నవిగాని యవిరెండును యీ కాట్లకు మధ్యనుండునొకేనాళములో బ్రవేశించి దేహమునవ్యాపించుట లేదు.



అనగా ఏ, బీ, అనుచుక్కలు పాము కాట్లుగాయున్న యెడల యందలి విషము రెంటికి మధ్యనుండు నొకేరక్తనాళమునందు, బ్రవేసించక ఏ యను కాటునందలి విషము యీ కాటుకు యెడమ వైపునయున్న రక్తనాళములోను, బీ యను కాటునం దలి విషము ఆ కాటున కు యెడమవైపునయున్న రక్తనాళము లోను ప్రవేశించి పీనిమార్గమున విషము హృదయ (ముంత గుండె) చలనమునాపు పర్యంతము నెక్కుచున్నట్టు తెలియవచ్చు చున్నది. పాముచిషము రక్తనాళములయందు నెక్కెడిమార్గము చక్కగాగమనించి చూచినయెడల పైకి బాగా తెలియవచ్చుచు న్నది. యెట్లనిన విషమెక్కుచుండు నాళము పైచర్మముమీ

దయుండు వెంట్రుకలు విషముతోయున్న స్థలమునకు వచ్చినతో డనే చర్మముమీద వ్రాలుచు విషముచ్చోటు వదలిన వెంటనే యథాప్రకారము మరల నిలుచుచున్నవి. యీ విధమున మొట్ట మొదట కాట్లను పరిశోధించి పిమ్మట యందలివిషము మేరక్త నాళములను ప్రవేసించియుండునది లేక ప్రవేశింపయున్నది కని పెట్టి చికిత్సచేయగలిగినవారికి సర్పచికిత్స పిల్లాటగా నుండును. "లిగేచర్" కట్టినయెడల విషము కాటు యందుండి రక్తనాళ ములగుండా నెక్కుటయాపబడును గాని యీ "లిగేచర్" తగుమయినంత బిఱ్ఱుగా కట్టనియెడల విషము దేహములో వ్యాపించుటకు మార్గము కలిగి శీఘ్రములో మరణము కలుగ జేయుచున్నది. "లిగేచర్" నిండాబిఱ్ఱుగా కట్టబడినయెడల విషము దానిని దాటిపోవుటకు మార్గములేకపోవుటచేత యీ కట్టుకు దిగువప్రదేశమునందే యంతట వ్యాపించుచున్నది యిట్లువిషముయే ప్రదేశమున వ్యాపించుచున్నదో యట్టి ప్రదే శము తిమ్మిరెక్కి స్పర్శనాజ్ఞానము లేనిదై యుండను అట్టిచో టునిండా బరువుగాను యిటుఅటు కదల్చుటకు నిండాకష్టము గాను గానిపించుచున్నది. సర్పవిషము ముఖ్యముగా నాడులను నశింపజేయుటచేత దేహముదాని యథాకార్యములను జేయలేక నశించునట్లు కొందరభిప్రాయ పడియున్నారు. యేలననగా పాము విషము దేహమున వ్యాపించినవెంటనే పంచేంద్రియములు వాటియొక్క యథాశక్తిని గోలుపోవుచున్నవి. కన్నులెఱ్ఱనై పాపలు విస్తరింపబడినవగుచున్నవి. కంఠధ్వని మారుచున్నది. నాలుకరుచిలేకపోవుచున్నది. ఉప్పునకును చక్కెరకును భేదము తెలియకపోవుచున్నది. చెవులుగూడా వినబడకపోవుటయేగాక

తుదకు దేహామందు ముచ్చెమటలు బోయుటకు ప్రారంభించి రూఢ్యుబుట్టుచున్నది. కొన్నిసర్పములు కఱచినప్పుడు దేహామంతయు వాచుటయేగాక నాలుక, ముఖము మొదలగునవి నిండాభయంకరముగా కాన్పించుచున్నవి. కొన్నిసమయముల యందు నల్లగా యెఱ్ఱగా వమనమవుటయేగాక విరేచనమగున టుల తెలియువచ్చుచున్నది.



## మూడవ ప్రకరణము.



ఇందు "లిగేచరు" ప్రయోగచికిత్సను గురించియు పాములవాంద్రవల్ల వాడబడు యితర చికిత్సలగురించియు వివరించుచున్నాడను. "లిగేచర్" ప్రయోగమునందు నిండా అనుభవము ధైర్యము, విమర్శనా జ్ఞానము యీ మూడును గావలసియున్నవి. గాన యీ "లిగేచర్" ప్రయోగమును అనుభవవేత్తలగు వారిపద్ద నేర్చుకొనవలసి యున్నది. అనుభవముచాలని వారు యిట్టి లిగేచర్ ప్రయోగమును గావించిన యీ కట్లు కావలసి యుండునంతకంటె యెక్కువ బిఱ్ఱుగాగాని లేకవుండవలసిన దానికంటె నిండావదులుగాగాని యుండుట తటస్థించి యీ "లిగేచర్" కట్టబడిన వుద్దేశ్యమునకు విఫలము గలుగుటకు కారణమగుటయేగాక నిండాబిఱ్ఱుగానుండు సందర్భములయందు చికిత్సనుపొందువానికి వృధాగా బాధను గలుగజేయుచున్నది. గావుననే యెప్పుడు "లిగేచర్" కట్లను కట్టునపుడు యీదిగువవిశదీ

కరింపబడినమూఁడు ముఖ్యాంశములను గమనించ వలసియున్నది. మొదటిది యెప్పుడు "లిగేచర్" కట్టవలసినస్థలమును గుర్తెరిగి అట్టిచోట కట్టవలసినదేగాని యిష్టప్రకారము యెక్కడనంటేయ క్కడ కట్టుట పనికిరాదు. రెండవదిఅట్లుకట్టబడిన లిగేచర్ కట్లువుం డవలసిన దానికంటెమిక్కిలి బిఱ్ఱుగాగాని వదులుగాగాని కట్టగూ డదు. మూఁడవది యీ "లిగేచర్" కట్లను చర్మము ముడతలు పడకుండా సఫాయిగానుండునట్లుగాచూచికట్టవలయును. యీ "లిగేచర్" ప్రయోగమును గావించుటయందు అనుభవముగ లుగజేసుకొనదలచిన వారెల్లరు ముందుముందు పైమూఁడువాం శములను గమనించుతూ తమదేహామునందయినను సరే లేక యితరులెవ్వరయినను యిందులకొడబడినయెడల వారిదేహాము నప్రయోగించుతూ అనుభవము గలుగజేసుకొనుట మంచిది. యీ "లిగేచర్" కట్లకు వుపయోగించెడిత్రాడు యెంత సన్న ముగానుండుట తటస్థించిన దానివలన బాధ అంతనెక్కువగా గలుగుటకు కారణమవుచున్నది. లావుత్రాడయిన యెడల తగి నంత బిగింపులేక పోవుటచేత విషమును నిలిపిపెట్టునంతటి స్థితి యందుండకుండుటకు కారణమగుచున్నది. గావుననే "లిగేచర్" కట్ల కుపయోగించు త్రాటిని తగుమయినంత లావుగలదిగా చూచి నేర్పరుచుకొనవలసియున్నది. యిందుకు జనపత్రాడయి నను లేక అంతకన్న కొంచెము లావుగనుండు త్రాడేదయినను పనికి వచ్చుచున్నది. కఱువబడినవెంటనే "లిగేచర్" కట్టునెడల కొట్లుబడియున్నచోటికి ఒకటిరెండు అంగుళములుపైన మొద టిలిగేచర్‌ను కట్టవలయును. కఱచినప్పటినుంచి "లిగేచర్" కట్టునప్పటికి చాలాకాలయాపనము జరిగియుండునెడల కఱువ

బడియున్న అంగముయొక్క అగ్రభాగము యెచ్చటయుండునో అచ్చోట "లిగేచరును" కట్టవలయును. యెట్లనిన, సదరు కాటు కాలియందే చ్చోటనయిన యుండు నెడల ఆలశ్యము జరిగిన సందర్భములయందు, ఆకాలితొడ పై భాగమున మొదటి "లిగే చర్" కట్టుటకు వీలుగలప్రదేశ మెచ్చటయుండునో అచ్చోట నొకటి కొకటి కొంతదూరములోనుండునట్లు కనీసము మూడు లిగేచరు కట్లయినను కట్టవలసియున్నది. యీ కట్లు మొదటి దానికంటె రెండవది కొంచెము బిఱ్ఱుగాను. రెండవ దానికంటె మూడవది మరికొంచెము బిఱ్ఱుగాను నుండునట్లు చేయవలయును. యిట్లుచేసిన తర్వాత వెంటనే యాకట్లను నీటితో తడుపవల యును. యిట్లు చేయుటచేత సదరుకట్ల యొక్కదారము తడిచి నదై కట్టుకట్టబడిన ప్రదేశము చక్కగా బిగియునట్లు చేయుచు న్నది. యిట్లు "లిగేచర్" కట్లుసచక్కగాప్రయోగించిన యెడల సర్పదంష్ట్రునికి గలుగవలసిన భయమేమియు లేదు. యీ లిగేచర్ల విషము దేహమునందు వ్యాపించుటను పూర్తిగానాపకపోయి నప్పటికిన్ని చికిత్సలు జేయుటకయినను తగుమయినంత సావకాశ మును గలుగ జేయుచున్నవి. కాటునందలి విషము రక్తనాళములను వెదకుటకును వాటిగుండ దేహమునవ్యాపించుటకును కొంతకా లముపట్టుటచేత "లిగేచరు" కట్టబడి వెంటనే కాటుగల ప్రదేశము నందుపరీక్షించిచూచి యాచోటునందు వాపు గలిగియుండిన యెడలగూా కాట్లమీాద యెఱ్ఱని నిప్పును పెట్టవలయును. యెప్పుడూ ఆకాట్లకు నిప్పును అంటించుచున్నామో అప్పుడే వాటియందుం డువిషము ఒకవిధముగు స్వల్పశబ్దముతోగూడా నసింపజేయబడు చున్నది. యీచికిత్సయందు యెఱ్ఱగనుండు నిప్పునకంటె యెఱ్ఱగ

కాలుచున్న యినుపకొడ నిండా ప్రయోజనకారిగా నుండును. పాములవాండ్రు సాధారణముగా మూడు విధములగు చికిత్స లను వాడుచున్నారు. అందులో మొదటిది నోటితో విషమును పీల్చివూయడము. రెండవది పీల్చుటకు వీలుపడనటువంటి స్థలము లలో పైజెప్పబడిన "లిగేచర్" ప్రయోగమునుగావించి సదరుకా ట్లయందలి విషము దేహమునప్రవేసించక యింకా సదరు గాయ ములలోనె యుండుటతటస్థించినయెడల రక్షకర్మగావించి సదరు కాట్లయందలి విషము నిర్మూలింప జేయుటయు. మూడవదికాట్ల యందలి విషము వాటిని వదలి దేహములో ప్రవేశించియుండు సందర్భములలోఅప్పటి నాశమును చోటును గుర్తించి అట్టిచోట నుంచి రక్తమును స్రవింప జేయుటయుగానున్నది. మొదటి దగునో టితో విషమునుపీల్చుడమునిండా సులభమయినదిగాయున్నది. తగుసందర్భములయెందెల్ల యీచికిత్సనిండా శ్రేష్ఠమయినదిగాను జయప్రదమయినదిగాను యుండుటయె గాకకఱువబడిన ప్రదేశ మున వెంటనే చికిత్స గావించుకొనుటకు నిండావీలయినదిగాను న్నది. అయితె యిట్టిచికిత్స చేయువారు తమనోటియందలి పంటి చిగుళ్లు మొదలయినవి మంచి ఆరోగ్యస్థితియందుండిననే తప్ప లేని యెడల యిట్టి చికిత్సకు ప్రయత్నింపగూడదు. రెండవదియగురక్ష కర్మ ప్రయోగమునందు పై "లిగేచర్" ప్రయోగచికిత్సలోనుద హరింపబడిన యెఱ్ఱని నిప్పునకుబదులు పాములవాండ్రు సీలువలె చేయబడి అనగా పిడికలిగి యుండునెఱ్ఱని యినుప గుండ్ర మైనముక్కలను వాడుచున్నారు. నిప్పు సాధారణముగా యెఱ్ఱని యినుమువలెచాలాకాలము వేడినికలిగియుండకపోవుటయే వాం డ్రుయెఱ్ఱగా కాల్చినయినుమునువాడుటకు కారణమై యున్నది

యీ విధమయిన రక్షకర్మ చికిత్స జేయుటయందు పై జెప్పబడిన గుండ్రమైన తలగలిగి నటువంటి యినుప సీల్లు రెంటిని గాని లేక నాల్గిటిని గానిచేసి వుంచుకొనుట ఆవశ్యకము. పాములవాండ్రు సాధారణముగా రెండుమూడు వాడుట గలదు. యేలననగా సాధారణముగాపామువల్ల కలుగబడినచోట రెండురంధ్రములు యేర్పడుటచేత రెంటికిరెండు వాడుచున్నారు. యిట్టి యినుపముక్కలు తయారుగా చేతియందు నుండని సమయముల యందెల్ల నెఱ్ఱగా కాలుచున్ననిప్పును వాడుటకు యేమియు ఆక్షేపణయుండదు. సర్పవిషము కాటును వదలి దేహమునందుదెటకు ప్రారంభించిన తరువాత పైరక్షకర్మప్రయోగమువలన ప్రయోజనము లేదు. అనగా యీ రక్షచికిత్స విషము కాటును యింకా వదలక కాటునందే నిలచి యుండునప్పుడు జేయబడవలసినదె గాని అటుపిమ్మట కాదు. విషముగాయమ్మును వదలి దేహమునందెక్కుటకు ప్రారంభించినప్పుడు ముందుచెప్పబడిన మూడు లిగేచర్ కట్లలో మొదటిలిగేచర్ కట్టువద్ద విషము నిలచియుండునది లేక దానినితప్పించుకొని రెండవ "లిగేచర్" వద్ద నిలువబడియుండునది జాగ్రతతో కనిపెట్టవలసియున్నది. అదియెట్లనిన విషము సాధారణముగా పై జెప్పబడినప్రకారము రెండునాళములను వెదకికొని వాటిమార్గమున వూర్ధ్వముఖముగా దేహమునందునెక్కుచుండుటచేతను సదరు నాడుల యందలి ప్రవాహమునకు మనము గావించిన లిగేచర్ ప్రయోగమువల్ల అడ్డుకలుగుటచేతను విషము లిగేచరుకట్లను దాటజాలక యా కట్ల క్రిందిభాగమున నిలుపబడినదై యానాడులను అతితీవ్రముగా కొట్టుకొనునట్లు జేయుచున్నది. యిదిమన

నుచక్కగా యాకట్లువద్ద పరీక్షించి చూచిన యెడల యేకట్టు క్రింద విషము నిలుపబడియుండునది తెలియవచ్చుచున్నది. కొన్ని సమయములలో కఱవబడినమనిషికి స్మారకము తప్పక తెలివి గలిగి యుండినయెడల వానివల్లకూడా విషమెంతవరకెక్కియుం డునది తెలియుటకు వీలయివున్నది యిట్లువిషముండుచో టును కనిపెట్టినవెంటనే యేనాడులలోనుంచి విషము యెక్కు టకయి ప్రయత్నించుచున్నదో ఆనాడులవద్ద అచ్చట యుండు లిగేచర్ కట్టుకు క్రిందుగా లాన్సెటుఅను సన్నకత్తి మొనతో పొడిచి మార్గమును కలుగజేయవలయును. యిట్లు చేయుటచేత ఆనాడులయందు నెక్కుచుండు విషముపైన చేయబడిన నాళద్వార ముంగూడా లిగేచరు కట్టువద్దికి వచ్చి దాటిపోవుటకు మార్గము లేనందున బయటికి వచ్చుచున్నవి. ఒకవేళవిషము అప్పుడే కాల్ల నువదలి యింకామొదటి "లిగేచరు" కట్టియుండుప్రదేశమునకు వ్యాపించకయుండినయెడల ఆకట్టునకుక్రింది ప్రదేశములో ఆకా ల్లకు నేరుగా కొంచెముపైన లాన్సెట్టుఅను చెప్పబడు చిన్నకత్తిమొనతో పచ్చబొడుచువిధమునదగ్గరదగ్గరగా పదిహే ను యిరువైచోట్లపొడవబడి ఆప్రదేశమునుంచిచక్కగా రక్తము బయటికి బయలుదేరునట్లు చేయవలయును. యిట్లుచేసినవెంటనే సదరుగాయములు చేయబడినచోట తుపాకిమందున్న వుప్పున్ను పొడిచేసి పూయవలయును యిట్లు చేయుటవలన సదరుగాయ ములనుండి రక్తముధారాళముగాబయటికివచ్చుచున్నది. రక్తము బయటికి ధారాళముగాయెప్పుడు రాను ప్రారంభించుచున్నదో అచ్చటనుండు విషముకూడా దానితోగలసి యింకివర్ణము గలదై సదరుపొడువబడిన స్థలములనుంచి బయలువెడలుచు

న్నది. విషమున్న స్థళములలో తప్ప యితరస్థళముల యందలి రక్తము యధాప్రకారము యెఱ్ఱనిరంగుగలదై యున్నది. పైజెప్పబడిన విధమున రక్తస్రావ్యము జేసినయడల శరీరములోప్రవేశించిన విషమంతయు బయటికివచ్చుచున్నది. ఒకవేళపూర్తిగారాకపోయినను చాలాభాగము వచ్చివేయుటచేత దాని బలము తగ్గిపోవుచున్నది. కొన్నిసమయములలో మొదటి లిగేచర్ కట్టును దాటిరెండవలిగెచర్ వుండుచోటికిని రెండవ లిగేచరు కట్టును దాటి మూడవ లిగేచరు వుండుచోటికిని విషము వ్యాపించుట తటస్థించుచున్నది. యేలననగా లిగేచరు కావలసినంత బిఱ్ఱుగాకట్టబడక యుండుటచేత యిట్లగుటకు కారణమగుచున్నది. గావున రెండవలిగేచరువద్దను మూడవలిగేచరు వద్దను పైనజెప్పబడిన ప్రకారము లాన్సెటుఅను చిన్నకత్తిమొనతో విషము యెక్కుచుండెడి నాడులయందేగాక యితరస్థళములు అనగా అందుకు సామీప్యప్రదేశములందుకూడా పొడిచిరక్తమును పరీక్షించి చూడవలయును. యిట్లు చూచినయడల క్రిందకట్టబడియున్న "లిగేచర్" లనుదాటివచ్చి యుండు విషమేదయినయున్నయడల వెంటనే రక్తము నల్లవర్ణముగలదై బయలుబడుచున్నది. విషము లేకపోయిన యడల నెత్తురు యధాప్రకారము నెఱ్ఱనై యుండుట చూచుచున్నాము. రక్తము గాయములనుంచి ధారాళముగా బయటికిరావడము తగ్గినయడల గాయములమీద చరుమబడియుండు తుపాకిమందు వుప్పుచూర్ణమును బాగావేడిగానుండు నీళ్లతో కడిగివేయవలయును. యిట్లు కడిగినతరువాత ముందు బచ్చబొడిచినవిధమున చేయబడిన గాయములనుంచి రకము రాక నిలచినయడల మరల దానిచుట్టుపట్ల అక్కడక్కడ

అదేవిధమునమరలబొడిచి దానిమీాద తుపాకిమందుదొరకని సందర్భములలో సముద్రపుప్పుచూర్ణమునయినను చరిమి పై విధమున రక్తస్రావము చేయవలయును. యీా విధమున రెండు మూడు పర్యాయములు పై జెప్పబడిన లిగేచర్ల మధ్య రక్తము స్రవింపజేసినయడల ఒకసారికంటె మరియొకసారి సదరుప్రదేశములనుండి బయలుదేరు రక్తము యెఱ్ఱగా రానుప్రారంభించుచున్నది. రక్తము యెప్పుడు బాగా యెఱ్ఱనై రాను మొదలుబెట్టుచున్నదో అప్పుడు విషమచ్చోట యేమియు లేనట్లు తెలియవలయును. యింకా యేమయిన నిలచియున్న దేమో యనుసందేహము గలిగినయడల ఆప్రదేశములను బాగా వెచ్చజేయబడిన సముద్రపు వుప్పుతో కాచవలయును మరికొన్నిసమయములలో విషమెచ్చటయున్నది తెలియరాకుండుటకూడా కలదు. యిట్లుండుట తటస్థించినయడల లిగేచర్లు కట్టినవెంటనే కఱువబడినప్రదేశమునను పై లిగెచర్ల మధ్యప్రదేశమంతయు బాగా వేడిగానుండునీళ్లతో కడిగిచూచినయడలవిషమున్నచోట చిన్న బొబ్బవలెబయలుదేరుట జూచుచున్నాము. వెంటనే అట్టిచోట లాన్సెటుమొనతో పొడిచి పైనజెప్పబడిన విధమున అందుండు విషమును బయటికివచ్చునట్లు చేయవలయును. తుపాకిమందు సమయమునకు దొరకనియడల వుప్పుమాత్రము నూరి పొడిచేసి పైనచెప్పబడిన సందర్భములయందు వుపయోగించుటకు యేలాటి అటంకము లేదు. లిగేచర్లు కట్టి లాన్సెటుతో విషమును బయటికివచ్చునట్లు చేయుసందర్భములయందేగాక యితర అన్ని విధములయిన చికిత్సలయందును సర్పముచే కఱువబడినవానిని వెల్లకిలా పరుండబెట్టి చికిత్స చేయరాదు. అట్టివానిని యెప్పుడు దేని

నైనా అనుకొని కూర్చుండునట్లు చేయవలయును. యీసమయమున వానిని నిద్రపోనియ్యక యుండునట్లు చేయుటయేగాక యేలాటి ఆహారమును తిననివ్వగూడదు. అధైర్యపడకుండా యెప్పుడు యేదోయొకసంగతిని గురించి మాటలాడునట్లు చేయుటయేగాక ధైర్యమును చెప్పుచుండవలయును. అయితే దేహము నుంచి లాక్ సెటుమూలమున విషమునుబయటికి చక్కగాస్రవింపజేసిన తరువాత అనగా లిగేచర్లక్రింద జేయబడినగాయముల గుండా రక్తము యెప్పుడుయెఱ్ఱగా బయలుదేరప్రారంభించుచున్నదో అప్పుడు వానిని కొంచెముసేపు విశ్రమించునట్లు చేయవచ్చును. యిట్లు చేయునప్పుడు పైన వుదహరించిన విధమున వేడిజేయబడిన వుప్పుతోసదరుగాయములమీద కాపడముమాత్రము విడువకపెట్టుచుండవలయును. యీ ప్రకారముగా జేయుచున్నప్పుడు మూడునిమిషములకు నాలుగునిమిషములకు ఒక్కొక్కపర్యాయము లాక్ సెటు ప్రయోగమువలన దేహమునందలి రక్తము మొదటిదఫాచూడబడిన విధమున నెఱ్ఱగాయుండునదిలేక మరల మారినదికనిపెట్టుతూ రావలయును. యెందుకనగా దేహమునందు యేమయిన విషము యింకా నిలచియుండునెడల అది మరల రక్తములో కలసి నల్లనై బయలుదేరుట తటస్థించుచున్నది. గావుననే రక్తమును యిట్లు అప్పుడప్పుడు పరిశోధించవలసివచ్చుచున్నది. ఒకపర్యాయము పరిశోధించిన పిమ్మట ఘంట రెండుఘంటలకాలములోపుగా సదరు రక్తము వర్ణముమారక నెఱ్ఱగానె వచ్చుచుండునెడల అప్పుడువిషము దేహములో యేమియు లేనట్లుగా వూహించవలయును. కఱ్ఱవబడినవానికి యికయేమిప్రాణభయము లేనందున పైన జెప్ప

బడియున్న లిగేచరుకట్లను యిప్పుడు ధారాళముగా విప్పివేయ వచ్చును.

మొదటిప్రకరణములో పాములు పెద్దవిగానున్నయెడల వాటికి కోఱలు పెద్దవిగానుండుననియు, కోఱలుపెద్దవిగానున్న యెడల కాట్లులోతుగా బడుచున్నవనియు జెప్పబడి యున్నది. యిటువంటి సందర్భములలో కొన్నిచోట్ల మనము కట్టు లిగేచరుకట్లవల్ల ప్రయోజనము లేకపోవుచున్నది. యేలననగా కోఱలు లోతుగాదిగియుండుటచేత విషముదేహమునందునిండా లోపలప్రవేసించినదై పైనకట్టబడు లిగేచరుకట్ల వల్ల నిలబెట్టబడుటకు వీలులేకపోవుచున్నది. యీకాట్లునిండా లోతుగా నుండుటచేత వీటిగుండారక్తముబాగా బయటికివచ్చుచున్నది. గావున మనముకట్టిడిలిగేచర్లు విషమును నిలిపినను లేక నిలుపక పోయినను సదరుకాట్లనుంచి వచ్చెడిరక్తము ధారాళముగా వచ్చునట్లు చుట్టుప్రక్కల చేతితోవ్రుత్తుటవల్లగాని లెదా లాన్‌సెటుమొనతో కొంచెముద్వారములు పెద్దవిగాజేయుట వల్లగాని చేయవలయును. యిట్లు చేయుటకు నావకాశములేని సందర్భములయందెల్ల వెంటనే రెండుమొద్దుకొడవళ్లను యెఱ్ఱనగునట్లుకాల్చి మొదటిలిగేచరుమీద సదరుకాటులున్న అంగము చుట్టునుకాలంగుళములోతునకు మించకయుండునట్లు వాతవేయవలయును. కొన్నిసమయములలో అనగా చర్మముక్రిందకండలేని స్థలములుగానున్నయెడల యీవాత యెముకనుగూడా తగులు చున్నది. గనుకనే యీ చికిత్సలు మంచిఅనుభవశాలులు గాయుండు వారికితప్ప యితరులకు వీలుపడదు. రకుకర్మప్రయోగములయందును లాన్‌సెటు ప్రయోగమునందును రక్తనాళ

ములకు భిన్నముగలుగకుండునటుల ముఖ్యముగా జూడవలయును. ఒకవేళ యేదయిన భిన్నముగలిగినయెడల సదరుగాయములు మానినవెనుక ఆయంగములకు భిన్నముగలుగుచున్నది. రక్తకర్మప్రయోగములం దెల్ల శరీరమునందు పైపైనున్న స్వల్పనాడులు నసింపబడినను పెద్దనాడులకు హానికలుగకుండ మాత్రము జూడవలయును. యిట్లు వేయబడినరక్తులవల్ల గలిగెడి గాయములకు మంచి కొబ్బెరనూనెను పట్టించవలయును. యిట్లు ప్రతిదినము పట్టించుతూ వచ్చినయెడల కొద్దిరోజులలో ఆగాయములన్నియు మానుచున్నవి.

పై చెప్పబడిన విధాయకములన్నియు లిగేచరుప్రయోగము గావించిచేయు చికిత్సావిధానమునందు ఆచరించవలసిన విధాయకములగుటచేత యిప్పుడు లిగేచర్ ప్రయోగము గావించకయెగావింపబడు చికిత్సల విషయమై జెప్పుచున్నాడను లిగేచరు కట్టుటకు వీలులేసికాట్లు అగుదుగా తటస్థించుటచేత అట్టికాట్లనుంచి సందర్భానుసారముగా విషమును బయటికివచ్చునట్లు చేయడము ముఖ్యము. ముందు చెప్పబడినదగు విషమును నోటితోపీల్చడము నందు మంచిబలముగల మనిషినిగా జూచి వానినోటితో పీల్చి వుూయునట్లు చేయవలయును. విషము చేదుగా యుండుటచేత సదరుగాయములనుంచి యెంతదూరము రక్తము చేదురుచిగలదై వచ్చుచున్నదో అంత పర్యంతము సదరు గాయములనుండి రక్తమునుపీల్చి వుూయునట్లు చేయవలయును. యెప్పుడుగాయములనుంచి వచ్చెడిరక్తము చేదుగానుండక యథాప్రకారము వుప్పగానుండుటకు ప్రారంభించుచున్నదో అప్పుడు విషమంతయువచ్చి వేయబడిన ట్లూహించవలయును.

యిట్లు విషమంతయు పీల్చివ్రాయబడిన పిమ్మట సదరుకాట్లను ముందుజెప్పబడిన యినుప ముక్కలతో నయినను యవిదొరకకపోయిన యడల యెఱ్ఱగా కాలుచున్న నిప్పుతోనయినను కాల్చవలయును. ఒకవేళ లిగేచరు ప్రయోగమునకు వీలులేకపోయినయెడల లాన్సెటు మొనతో సదరుగాయములను కొంచెము పెద్దవిచేసి పైనచెప్పిన విధమున కాటునందలి విషము కాటును వదలకయుండునపుడే అనగా మొదట కలిగెడి వాపుతీసిపోకయున్నప్పుడే రక్తకర్మ గావించవలయును. పాము విషము దేహమునందు నిండాలోతున ప్రవహించకుండుటచేత అనుభవములేని వారలందరు పాముకఱచిన వెంటనె కఱువబడిన కాట్ల మీదయున్న చర్మమును రెండు వ్రేళ్లతో యీడ్చిపట్టి ప్రతి కాటుమీదను ఒకదమ్మిడి వెడల్పునకు మించక గుండ్రముగా యుండునట్లు కోసివేయవలయును. యిట్లు చేయబడినవెంటనే సదరు రెండు గాయములనుపైన వుదహరించబడియుండు ముద్రలవంటి గుండ్రమయిన తలగలనెఱ్ఱని యినుప ముక్కలతో రక్తవేయవలయును. పాముకాటు వీపునగలుగుట తటస్థించినప్పటికిన్ని పై జెప్పిన విధముననే పాతికలేక అర అంగుళములోతుగా యుండునట్లు కోసివేసి పైనజెప్పబడిన విధమున రక్తవేయవలయును. యీరక్తులవల్ల కలిగిన గాయములు మానుటకు పైన జెప్పబడినట్లు కొబ్బెరనూనెను వ్రాయుచుండ వలయును. యీ పైన జెప్పిన చికిత్సలన్నియును విషము గుండెలకు యెక్కకమునుపు చేయబడ వలసినవేగాని విషము గుండెలకు యెక్కినతరువాతగాదు. విషము గుండెలయందు ప్రవేశించిన వెంటనే గర్భకోశములందు కఫముత్పన్న మగుచున్నది. యీ కఫము

తుదకు కంఠనాళముల గుండా నోటియందు గన్పించుటం జేసి శ్వాసకోశములయొక్క నాళములను అటంకపఱచినదై వూపిరి విడుచుటకు సాధ్యముగా నీయక ప్రాణోపద్రవమును గలుగ జేయుచున్నది. యిట్టి సమయములయందు ముఖ్యముగా గర్భములోనుండెడి యీ కఫమును బయటికి వచ్చునట్లుచేసిన యడల శ్వాశకోశములకు గలిగెడి ఆటంకమును తగ్గించుచున్నారము. యిట్లుచేయుటవలన కఱువబడిన మనిషికిగల ప్రాణోపద్రవము తగ్గుచున్నది. దానివలననే పాములవాండ్రు సాధారణముగా కఱువబడినవాని గొంతులోనికి ఒకపొడుగాటి గుడ్డపేలికను పోయినంతవరకు చొప్పించి అందుండెడి కఫమును తీసివేయుచున్నారు. లేని యడలకొన్నివేళలలో నిండావేడిగానుండు నీళ్లను కొంచెముకొంచెముగా అప్పుడప్పుడు త్రాగించుచున్నారు. కఫముగొంతుకునందు చుట్టుకొన్న సమయములో మనము ఆకఫమును వెళ్లదీసి ప్రాణమును కాపాడడముముఖ్యము. గావునవట్టివేడి నీళ్లుకొంచెముయిచ్చిన తరువాత వమనము గలుగునట్లు యేదయినను యిచ్చుట మేలయియున్నది. కొందరు మైలతుత్తమును చింతపండుపులుసు మస్టర్డు అనగా ఆవనూనెలో కలిపి త్రాగించుచున్నారు మరికొందరు మంచినీళ్లలో నుండుచాపలనుకడిగిననీసు నీళ్లను త్రాగించుచున్నారు. విషములిగేచర్లవల్ల నిలిపిపెట్టబడియున్నపుడు కూడాముందు జాగ్రతకు గాను వమనవుపధమును ప్రయోగించవచ్చునుగాని అట్టిసందర్భములలో పైనజెప్పబడియుండు మైల్‌తుత్తమునువదలివేసి అప్పటపు ఆవనూనెలో చింతపండు పులుసును మాత్రము కలిపి యివ్వవచ్చును. విషము గుండెలలో ప్రవేశించి పైజెప్పబడిన విధమున కఫము చుట్టుటకు

ప్రారంభించిన యెడల వెంటనే చింతపండును ఆవనూనేలో కలి యపిసికి దానిని ప్రతి అయిదు లేక పదినిముషములకు ఒకడోసు అనగా మోతాదు ప్రకారము డోసు-ఒకటింటికిం అయిదు గ్రెయినుల తూకముగల మైల్ తుత్తమును కలిపి యిస్తూరావల యును. అయితే డోసు కఱువబడి యున్నవాని స్థితిగతులను అను సరించి పదినిముషములకొకపర్యాయమయినది లేక 15 నిమిషము లకొకపర్యాయమయినది తీర్మానించవలసియున్నది. పైచెప్పబడిన చాపలుగడిగినటువంటి నీసునీళ్లను త్రాగించుసందర్భములయందు ఆచాపలనువాటి మీద నుండు పొలుసుతో కూడా రెండు మూడు పళ్లనీళ్ల యందు బాగా తోమికడిగిన తరువాత సదరు నీళ్లను దానియందుండు పొలుసు మొదలయిన దంతయు లేకుం డునట్లుగా వడియకట్టి వడకట్టబడిన యానీటిని కఱువబడినవానికి త్రాగించవలయును. పులుపుగలపదార్థములలోచింతపండు నిమ్మ కాయ యీరెంటియొక్క పులుసు సర్పకాటునందు విషమును విరుచునట్టి స్వభావముగలవగుటచేత నిండాప్రయోజనకారియై యున్నవి. యివిముఖ్యముగా వమనమును గలగజేయుటకు ప్రయోగింపబడుచున్నవిగాని వేరుగాదు. విషము గుండెలకుతట్టి గర్భకోశము శ్వాశకోశములు యావత్తూకఫముచేత ఆవరింపబడి శ్వాసమును అడ్డగించినదై ప్రాణమును హరించుట చేత లోప ల ప్రయోగించు అవుషధములు అన్నియు విషజనితములయి సదరుగర్భమును ఆవరించియున్న కఫము మొదలగు వాటిని వమన మార్గమున బయటికి దెచ్చుచున్నవి. యిట్లు పలుమారు గర్భకోశమునందుండు నదంతయు వమనమగుటచేత విషమంతయు బయటికి వచ్చుచున్నది. నాచిన్నతనమునందు నేనుండతట స్థించి

నగ్రామమునందొక నాటిరాత్రి నొకడు చీకటియందు దారిలో వచ్చుచుండ పాముచేక ఱువబడినవాడై దానిని గమనించకయే నింటికివచ్చి యథాప్రకారము పక్కపైన పరుండెను గాని కొన్ని నిముషములలోపల తలతిరుగుటయు నోటనురుగులు బయలుదేరుటయు యింటిలోనున్న పెద్దవారివల్ల కనిపెట్టబడి వెంటనే వుప్పును నోటవేయించి యదివుప్పగనుండక పోవడమును తెలుసుకొని యది పాము కాటని నిశ్చయించి నొకరాగి పాత్రయందు పెరుగును చిలికి త్రాగించి నొకవుయ్యాలమీద కూర్చుడంజేసి కళ్లు చుట్లునట్లు నూగించసాగిరి. యిట్లుచేసిన పదిపదిహేను నిముషములలోపల అతనువాంతి యెత్తుటకు ప్రారంభించెను. యిట్లు 5, 6 పర్యాయములు వమనముఆయిన తరువాత నాతనికి యథాప్రకారము తేలివితేటలు గలిగి వుప్పు నాలుకమీదవేసు కొన్నయడల ముందువలే యేమియు తెలియక యుండిన ట్లుండక సహింపగూడనంత నుప్పగాయుండినట్లు తెలియవచ్చెను. ఆరాత్రి అంతయు అతనిని నిదుర బోనియ్యకయుంచిరి. మరునాడు అతను అందరితోను యథాప్రకారము మాటలాడుటకు ప్రారంభించెను. గావున అవుషధ ప్రయోగము లన్నిటియందు వాటిముఖ్యోద్దేశము గర్భములోనున్న విషమును హరించుట గాని లేక వమనమార్గమున బయటికి వచ్చివేయునట్లు చేయుట గాని యైయున్నది. కొన్ని సమయములలో కొన్నికొన్ని అవుషధములు వమనమును గలుగ జేయలేక పోవుటయును గలదు. యీపైన జెప్పబడియుండు అవుషధములు యేవియు ప్రయోజన పడకపోయినప్పుడు తప్పకుండా పనిచేయునట్టి మూలిక యొకటికలదు. అదిదూరము నుంచిచూచుటకు ఆకారమునందు

పాముపలే కనుపించుచున్నది. యిది సృష్టియందు పాముకాటున కవుషధముగా నిర్మింపబడియుండుటచేత గాబోలు భగవంతుడు దీనికిట్టి రూపమునిచ్చుటకు కారణమయినది. దీనిపేరు మన మధ్యదేశమున పాములవాండ్రువల్ల నాగముష్టి అనియు వింధ్యోత్తర దేశములందుండు పాములవాండ్రువల్ల నాగఫణి అనియు పిలువబడుచున్నది. దీనివేరు చెక్క యీ రెండును యెట్టిసర్పకాటునందయినను అసమానమై పని చేయుచున్నవి. యివి నూరి కంటికి వేయవచ్చును. వమనమవుటకు నాలుక మీదవ్రాయుటయే గాక లోపలికి నూరిత్రాగించవచ్చును. యిది వాడిన సందర్భములలో యెప్పుడు వమనము గాకుండుటలేదు. యిది అన్నిటిలో అసమాన మయినది. యిట్లు వమనము అవుటకు ప్రారంభించిన వెనుక కఱువబడినమనిషికి త్వరలో దేహము తేలికయై కనుపించుటకు పారంభించుచున్నది. వెంటనే తెలివి తేటలు యథాప్రకారముకను బట్టుచున్నవి.



## నాల్గవ ప్రకరణము.



ఇందు మనపూర్వులు గురుముఖంబునంబడసి కాలక్రమమున మనయందు తగిన దేహమనోధారుఢ్యములు లేకపోటంజేసి శాస్త్రములయందు నమ్మకము చెడి తమను తలంచెడువారులేక గుప్తములయి నొకమూల నొదిగియుండిన గ్రంథరాజములందు వివరింపబడిన హాంశములను భక్తివిశ్వాశములు

గలిగి యభ్యసించదలచిన వారికెల్ల నుపయోగ మగునటుల కొన్ని యిందు వివరించుచున్నాడను. యీప్రకరణమునందు జెప్పబడి యున్న చికిత్సలు మనోపక్రిశ్రమవల్ల సాధించవలసినవై యు న్నవి. యిందలి మంత్రౌషధములయొక్క ప్రయోగములను దానిదానికి జెప్పబడిన విధమున జరిగించిననేగాని యవిమనకు వశకరములుగావు. యిది యందలి ముఖ్యాంశము. త్రికరణ శుద్ధిగాసాధించు వారలకు యిది కరతలామలకమై యుండును. మంత్రము లభ్యసించుటకును క్రియలు మొదలయినవి సాధించు టకును సూర్యగ్రహణకాలము శ్రేష్టమయినది. దీనివెనుక అమావాశ్య ఆదివారములుగాని లేక చంద్రగ్రహణకాలముగాని శ్రేష్టములుగా నెన్నబడుచున్నవి. సర్పకాటునకు చెప్పబడిన వారములు అందు వివరింపబడిన భేధాభేదములు విషముండు చోట్లు అందుకు చెప్పబడియున్న మంత్రౌషధములు ముందు జెప్పుచున్నాడను.

ఆదివారమునాడు కఱచిన పాము పేరు అనంతుడు. దాని విషముండుచోటు మోగాలుమీద. అదికఱచెడి పార్శ్వము దాపలిపార్శ్వము. ఆ మోగాలు మీదను అ, అ, అ, యను మూడు బీజాక్షరములు వ్రాసి దిగ మంత్రించవలయును. యిం దుకు మంత్రము అనంత, అనంత, హేళి హేళి, విజయ విజ యాయ స్వాహా:—అని దిగమంత్రించ వలయును. యిందుకు ఔషధము ఉప్పునూరి మంచినూనెలో కలిపి త్రాగించిన యడల విషముదిగును. యిందుకు జపము 5000లు.

సోమవారమునాడు కఱచిన పాము పేరు వాసుకి అని చెప్పబడుచున్నది. అదికఱచు పార్శ్వము దాపలి పార్శ్వము

దాని విషముండుచోటు మీగాలను. యిందుకు ఆ, ఆ, ఆ, అనే మూడు బీజాక్షరములు వ్రాయవలెను. యిందుకు మంత్రము:= ఓం న్నమోభగవతి వాసుకి వాసుక్షి వాళివాళి విజయ విజయా యస్వాహా. అని దిగ మంత్రించవలయును. యిందుకు జపము 3000 చేయవలయును. యిందుకు అవుషధము పండుకాక రాకును నీళ్లతోనూరి త్రాగించవలయును.

అంగారకవారము నాడు కఱచినపాముపేరు తక్షకుడు. అది కఱచెడి పార్శ్వము వలపలపార్శ్వము. దానివిషము కటిస్థలమందుండును. యీచోట ఆ ఆ ఆ అనేటి బీజాక్షరములువ్రాసి యీ దిగువ చెప్పబడినరీతిని మంత్రించవలయును. యిందుకు మంత్రము ఒంన్నమోభగవతే తక్షకతక్షక హేళీహేళి విజయ విజయా యస్వాహా. యింపుకు జపము 5000 చేయవలయును యిందుకు అవుషధము వేపచెక్క వేప ఆకు యీరెంటిని నీటితో నూరి త్రాగించవలయును.

భుదవారమునాడు కఱచిన పాము పేరు కర్కోటకుడు. అది కఱచుపార్శ్వము దాపలి పార్శ్వము. దానివిషము నాభియందుండును. ఆచోట ఉ ఉ ఉ అనే బీజాక్షరములు మూడు వ్రాయవలయును. యిందుకు మంత్రము ఓంన్నమోభగవతే విజయవిజయా యస్వాహా. యిందుకు జపము 3000 చేయవలయును. యందుకు అవుషధము మిరియాలు వుప్పునీళ్లుతోనూరి త్రాగించవలయును.

గురువారమునాడు కఱచిన పాముపేరు పద్మకుడన బడును. అది కఱచుచోటు వలపలి పార్శ్వము. దీనివిషము రొమ్మునందుండును. ఆచోటున ఆ. ఆ, ఆ, అనేబీజాక్షరములు

మూడు వ్రాయవలయును. యిందుకుమంత్రము. ఓంనమోభగ
వతే పద్మక పద్మక హెళి హెళి విజయ విజయా యస్వాహా అని
దిగ మంత్రించవలయును. యిందుకు జపము 3000 చేయవల
యును. యిందుకు అవుషధము పెన్నేరు గెడ్డ వ్రూడుగవేరు
నీళ్లతో నూరి కఱచినచోట చరుమవలయును లోపలికి త్రా
గించవలయును.

శుక్రవారము నాడు కఱచినపాము పేరు మహా పద్మకుడు
అని చెప్పబడుచున్నది. యిదికఱచుచోటు దాపలి పార్శ్వము.
విషముకంఠమునందు వుండును. ఆకంఠముమీద ఉ ఉ ఉ అనే
బీజాక్షరములు మూడువ్రాయవలయును. యిందుకు మంత్రము
ఓంన్నమోభగవతే మహాపద్మకమహాపద్మక హెళిహెళి విజయ
విజయా యస్వాహా. యిందుకు జపము 5000 లు చేయవల
యును. యిందుకు అవుషధము స్తాతచింత పండు చల్లతోనూరి
త్రాగించిన విషముదిగును.

శనివారమునాడు కఱచినపాము పేరు శంఖపాలకుడని
చెప్పబడుచున్నది. యిది కఱచుచోటు వలపలిపార్శ్వము.అనగా
యెడమ పార్శ్వము అని తెలియవలయును. దీనివిషము కన్నుల
యందుండును. గనుక కన్నులమీద రారారా అను బీజాక్షర
ములు మూడువ్రాసి యీ దిగువచెప్పిన విధమున మంత్రించవ
లయును యిందుకు మంత్రము ఓం న్నమో భగవతే శంఖపా
లక శంఖపాలక హెళిహెళివిజయ విజయాయస్వాహా అని దిగ
మంత్రించవలయును. యిందుకు జపము 3000 చేయవలయును
యిందుకు అవుషధము బెల్లపు పానకము త్రాగిస్తే విషము
దిగును.

అర్ధరాత్రమునందు కఱచినపాము పేరు కులికుడు. యి కఱచుపార్శ్వము దాపలిపార్శ్వము. దీని విషము శిరస్సున యుండును. శిరస్సునఉ అను బీజాక్షరము వ్రాసి యీ క్రింద చెప్ప బడిన మంత్రముతో మంత్రించవలయును. యిందుకు మంత్రము ఓంన్నమో భగవతే మహాగుళికమహాగుళిక హేళి విజయవిజ యాయస్వాహా అని దిగ మంత్రించవలయును. యిందుకు జప ము 5000 చేయవలయును. యిందుకు అవుషధము అనుముల పొట్టును నూనెతోనూరి త్రాగించవలయును. యిట్లు చేయుట చేత విషము దిగును.

## సర్పకట్టు మంత్రము.

ఓం హ్రాం క్షౌం క్షౌం మహావీరగరుడ సమస్త సర్వవిష నివారణా దుష్టసర్ప వాగ్బంధనం కురుకురు హ్రాం స్వాహాయని మనుష్యులు తొక్కకయుండు యిసుకనయినను లేదా మన్ను యినను 18మారులు మంత్రించి పోవుచున్న పాముమీద చల్లి నయడల నిలబడి పోవును పై మంత్రమును 1500 సార్లు జపించినయడల శిద్ధియగును.

## సర్పకాటునకుమంత్రము

సర్వవిషములకు ప్రళయకాల ప్రచండగరుడ మం త్రము-ఓం న్నమోభగవతే మహాప్రళయకాలమంత్ర ప్రచండ గిరుడాయపక్షీరాజాయమహాతీక్షణాయవజ్ర దంష్ట్రకరాళాయ భయంకరాయ రోమహర్షణాయ సర్వవిషహర్షణాయ సువర్ణ నేత్రాయ మహాగరుడాయ కాశ్యపసుత భయంకరాయ భోభో

ాయ వజ్రాయ వజ్రాంకురాయ వజ్రపంచక తక్షకప్రహా
యు అనంతవాసుకి అయిరావతకర్కోటక పద్మమహాపద్మ
కుళిక అష్టమహా నాగభూషణాయ సర్పవృశ్చిక విషత్రి
యు హానహాన శ్రిత శ్రిత ఘన ఘన గండు గండు కంప
శీఘ్ర శీఘ్ర ఆవేశ ఆవేశ అవాంతర అవాంతర కృష్ణ కృష్ణ
ధుర రాజసర్పవిష సంహారణాయ ఓం పక్షు పక్షు ఓం
హ్రాం హ్రూం హ్రూం ఫట్ స్వాహా. దీనిని 5000 మారులు
చిన మంత్ర శిద్ధియగును. పారుచున్న నీళ్లను తల్లక్రిందుగా
ననందు ముంచి తెచ్చి యీ మంత్రముచేత యిరువది యొ
మారు మంత్రించి పాముకఱచిన సంగతి చెప్పవచ్చినవానికి
స్తోగరువ బడినవానికి విషముదిగును. పాముచే కఱువబడినటు
మనిషి స్వయముగా నెదుట నున్నప్పుడు విషము దిగ మం
ంటకు జెప్పబడిన మంత్రము.

కాళీభళిహాళిభణీమారే మోరుమచ్చాన్వగం పెలకాల
తూసీ జాయూజవాతర్చిం నిచ్చునావా బిస్సు సీక్రకగపోచ
రగురు యీశ్వర మహాదేవరగాయ నాస్తివిషంనాస్తి
విషభక్షుణ విషభక్షుణ శ్రిగుత శ్రీజయాయ స్వాహా
కు జపము 5000 మార్లులు జేసిన మంత్రశిద్ధి యగుచు
యీమంత్రముచేత 21 మారులు నీళ్లను మంత్రిం
యును.

రక్తపింజర కాటునకు అవుషధము.

సూర్యగ్రహణము నందయినను లేక అమావాశ్య ఆది
రోజున నయినను నేలగొట్టివేరు తూర్పు దిక్కుగా బారి
దానిని ధూపదీప నైవేద్యములతో బూజించి తెచ్చి

యుంచుకొని దానిని బియ్యపు కడుగుతోనూరి త్రాగి యెడల రక్తస్రావము కట్టుబడును.

నాగుపాము కఱచినప్పుడు యివ్వబడవలసిన అవుష తిప్పతీగె ముష్టివేళ్లు ముష్టిచెక్కయివి మూడును చూర్ణ కలితో యిచ్చిన యెడల విషము దిగును

ఉస్తియాకు పసరు మంచినూనే యివి సమభాగవ కలిపి త్రాగించిన యెడల విషముదిగును.

పామును తొక్కినను కఱువకుండుటకు:—అవ యోగమునాడును పైజెప్పబడియున్న దినములయందున గగింజలను తెచ్చితాయతునందు భద్రపరచి దానిని మొక్కడ నయినను కట్టుకొన్నయెడల పామును తో తటస్థించినను అదికఱువక యుండును.

పుట్టలోనున్న పామునుగాని కలుగులోనున్న గాని బయటికివచ్చునట్లు చేయుటకు:— దూబరదండీ నలిపి పామువున్న కలుగులలో నెచ్చటయినను వేసిన లోపల పామువుండిన యెడల వెంటనే బయటికి వచ్చుచి

చేదుసారవిత్తులు క్రానుగవిత్తులు చేతిబీరవిత్తు శెన విత్తులు వీనిని సరిపాళ్లుగా కూర్చి నూరి ఆవుపంచిత కలిపి పుచ్చుకొనిన నర్వ సర్వవిషములు హరించును.

సమాప్తము.



Vedam & Co., Printers, Madras.